# గ్రహణ విషయ సంగ్రహం

**ముందుమాట**:-మన భారతీయ సనాతన హిందూ ధర్మములో గ్రహణాలకి ఎంతో ప్రాముఖ్యత ఉన్నది.అటువంటి గ్రహణ సమయంలో తీసుకొనవలసిన జాగ్రత్తలు, అనుష్టానాలు, శాంతులు, ఫలితాలు సప్రామాణికంగా ఉంచే ప్రయత్నమే నా ఈ వ్యాసం.హేతువాదులకి ఈ వ్యాసం చెంపపెట్టు అవుతుంది అని నా అభిప్రాయం.

**★★గ్రహణ సమయంలో దేవాలయంలో ఆరాధన విషయం★★**

**శ్లోకం|| "పురస్తాశ్చ పరస్తాశ్చ గ్రహణే చంద్ర-సూర్యయో:!**
**ద్వినాడికాం పరిత్యజ్య నిత్యపూజాం ప్రకల్పయేత్!!**
**మహోత్సవాऽద్యుత్సవేషు ద్వి ముహూర్తం పరిత్యజేత్!!**

**శ్రీ ప్రశ్న సంహిత ४८ అధ్యాయం ३४३-३४४ శ్లోకాలు.**

**తాత్పర్యం:-**చంద్ర సూర్య గ్రహణాలు సంభవించినప్పుడు పట్టకముందు ద్వినాడికా విడిచిన ద్వినాడికా సమయం విడచి నిత్యపూజలు జరుపుకొనవలెను.
కళ్యాణోత్సవ పవిత్రోత్సవ అధ్యయనోత్సవములు యందు ద్విముహూర్తం విడిచి తరువాత యధా విధిగా దేవ కార్యక్రమాలు నిర్వహించవచ్చు ను.
రెండు నాడికలు తర్వాత నిత్యపూజలు, రెండు ముహూర్తాలు తర్వాత కళ్యాణ పవిత్ర అధ్యయన ఉత్సవాలు చేసుకోవచ్చు
నాడికా అంటే 24 నిమిషాలు,ముహూర్తం అనగా48 నిమిషాలు

**★★గ్రహణమును చూడకూడని వారు★★**

**శ్లోకం|| జాతా గ్రహణ నక్షత్రే గ్రహణం చిద్రతత్రభమ్!**
**వశ్యేన్న గర్భిణీస్త్రీ వా పురుషా శ్చతధా స్త్రీయ:!!**

**తాత్పర్యం:-**గ్రహణ నక్షత్రమందు పుట్టిన స్త్రీ,పురుషులు, గర్భిణీ స్త్రీలు వీరు గ్రహణమును గాని , గ్రహణ సమయమునందింటి సందుల నుండి భూమి పై ఏర్పడిన మొర్రిగల ఎండ(వెన్నెల) నీడను గాని చూడరాదు.

**★★స్నానజపాదిక్రియ (జ్యో.ని 87 పృ1 శ్లో)★★**

**శ్లోకం|| స్పర్శే స్నానం జపం కుర్యాన్మధ్యే హోమం సురార్చనమ్!**
**ముచ్యమానే సదాదానం విముక్తి స్నాన మాచరేత్!!**

**తాత్పర్యం:–**గ్రహణము ప్రారంభ మైనపుడు స్నానము, జపము, మధ్యకాలములో హోమము, దేవ పూజ, గ్రహణమోక్ష సమీపములో దానము, సంపూర్ణముగా మోక్షమైనపుడు స్నానం చేయవలెను.

**★★గర్గో – పి (జ్యో.ని 85 పృ)★★**

**శ్లోకం॥ స్పర్శే స్నానం భవేమో గ్రస్తయోర్ముచ్యమానయోః!**

**దానం స్యాన్ముక్తయే స్నానం గ్రహే చన్ద్రార్కయోర్విధి:!!**

**తాత్పర్యం:–**గర్గనివచనానుసారము స్పర్శకాలములో స్నానము, గ్రస్తమైనపుడు హవనము, మోక్షము కలుగుటకు ముందే దానము, మోక్షమైన తర్వాత స్నానము చేయవలెను.

**★★దానఖండే (జ్యో.ని 91 పు)★★ గ్రహణములో దాన ప్రశంస**

**శ్లోకం॥ సర్వం భూమిసమం దానం సర్వే బ్రహ్మ సమా ద్విజా:!**

**సర్వం గఙ్గాసమం తోయం గ్రహణే చన్దసూర్యయోః!!**

**తాత్పర్యం:–**దానఖండములో ఈ విధముగా తెలిపేను. గ్రహణ సమయములో చేసిన ఏ దానమైన భూమిదానముతో సమానమగును, బ్రాహ్మణులందరు బ్రహ్మతో సమానమైన వారగుదురు. సూర్య చంద్ర గ్రహములలో జలము గంగా జలముతో సమానమగును.

**శ్లోకం॥ ఇన్దోర్లక్షగుణం పుణ్యం రవేర్దశగుణం తు తత్ !**

**గఙ్గాది తీర్థ సమ్రమ్ప్రాప్తౌ ప్రోక్తం కోటిగుణం భవేత్!!**

**తాత్పర్యం:–**చంద్రుడు లక్ష గుణములు, సూర్యుడు పది లక్షల గుణములు గంగాది తీర్థములు దొరికిన కోటిగుణముల పుణ్యము లభించును.

**★★గ్రహణ సమయంలో చేయరానివి★★**

**చింతామణి – (జ్యో ని 99 పృ 8, 9 శ్లో)**

**శ్లోకం॥ ఛేద్యం న పత్రం తృణదారుపురుషం కార్యం న కేశామ్బరపీడనం చ !**

**దత్త న శో ధ్యాన పురుషం న వాచ్యం భోజ్యం చ వర్జ్యం మద నో న సేవ్య:!!**

**వాహ్యం న వాజీద్విరదాది కిఞ్చిద్దేహ్యం న గావో మహిషీ సమాజమ్!**

**శతుభంయాత్రా న కుర్యాచ్ఛయనం చ తద్వత్ గ్రహే నిశాభర్తురహర్పతేచ్చ!!**

**తాత్పర్యం:–**

చింతామణి వచనానుసారము

1. పత్రములను ఛేదించరాదు,

2. తృణము,

3.కాష్టం,

4. పుష్పములను కోయరాదు

5.వెంట్రుకలు,

6.వస్త్రములను పీడించరాదు,

7. దంతధావనము,

8. కఠోర వచనము,
9. భోజన,
10. మైథునం
11. గుఱ్రము,
12. ఏనుగులు సవారి చేయరాదు,
13. గోవు,
14. గేదె పాలు పిండుట,
15. యాత్ర చేయరాదు,
16. పరుండ రాదు

**★★జ్యో.ని 85 పృ★★**

**శ్లోకం|| న సూతకాది దోషో త్ర దానహోమజపాదిషు !**

**గ్రస్తే స్నాయాదుదక్యాపి తీర్థాదుదృతవారిణా!!**

**తాత్పర్యం**:-దాన, జప, హోమములు చేయుటకు గ్రహణములో సూతకము ఏ విధమైన బాధను కలిగించదు. స్పర్శ జరిగినపుడు ఋతుమతియైన స్త్రీ కూడా తీర్థము నుండి వచ్చు నీటితో స్నానము చేయవచ్చును.

**★★ధర్మదర్పణే (జ్యోని 85 పృ) ★★**

**శ్లోకం|| ఆరనాలం పయస్తకం దధిస్నేహాజ్యపాచితమ్!**

**మణికస్తోదకం చైవ న దుష్యేద్రాహుసూతకే!!**

**తాత్పర్యం:**-ధర్మదర్పణ వచనానుసారము కలి, పాలు, మజ్జిగ, పెరుగు, నూనె, నెయ్యితో పండినది, మాణిక్య జలము, రాహుసూతకములో దూషితముకావు.

**★★మత్స్య పురాణము - మత్స్య పురాణ వచనము★★**

**శ్లోకం|| దశజన్మకృతం పాపం గఙ్గాసాగరసఙ్గమే!**

**జన్మాగర సహస్ర యతాపం సముపార్జితమ్!!**

**తత్తన్నశ్యేత్సన్నిహత్యాం రాహుగ్రస్తే దివాకరే!!**

**తాత్పర్యం:**-మత్స్య పురాణవచనానుసారము గంగా సముద్ర సంగమస్థానములో స్నానము వలన పది జన్మలలో చేసిన పాపము, వెయ్యి జన్మముల పాపము సూర్యచంద్ర గ్రహణ సమయంలో గంగాసాగర సంగమములో స్నానము చేయుట వలననష్టమగును. వ్యాసం-వ్యాసుని వచనము..

**★★వ్యాస:-వ్యాసుని వచనం★★**

**శ్లోకం|| చంద్ర సూర్య గ్రహేచైవ యోఽవగాహేత జాహ్నవీమ్!**

**స్నాతః సర్వతీర్థేషు కిమరమటతే మహీమ్!!**

**తాత్పర్యం:**–వ్యాసవచనానుసారము సూర్య చంద్ర గ్రహణం లో గంగాస్నానము చేయు మనుష్యుడు సమస్త తీర్థ స్నానముల ఫలమును పొందును, భూమిపై తిరగవలసిన పనిలేదు.

**★★రాత్రిలో స్నానవిధానము★★**

**శ్లోకం|| గ్రహణోద్వాహ సఙ్క్రాన్తివ్యాపత్తిప్రసవేషు చ !**

**స్నానం నైమిత్తికం కార్యం రా వపి న దుష్యతి!!**

**తాత్పర్యం:**–గ్రహణము, వివాహము, సంక్రాంతి, విపత్తి, ప్రసవములలో స్నానము నైమిత్తిక మగును. అందువలన రాత్రిలో చేసినను దోషము కలుగదు.

**వశిష్ఠః**

**శ్లోకం|| పుత్రజన్మని యథేచ తథా సఙ్క్రమణేరవే !**

**రాహోశ్చ దర్శనం కార్యం ప్రశస్తం నాన్యథా నిశి!!**

**తాత్పర్యం:**–వశిష్ఠమతానుసారము పుత్రోత్పత్తి, యజ్ఞము, సూర్యసంక్రాంతి, సూర్యచంద్ర గ్రహణములలో రాత్రిలో కూడ స్నానము చేయవలెను. వీటికన్న వేరైన వాటిలో స్నానము వర్జితము.

**★★చండేశ్వర వచనం★★**

**శ్లోకం|| దధిమధురసంయుక్తం చన్ద్రమానానుమానం !**

**రజత కృతశశాఙ్కం కాంస్య పాత్రాన్తరస్థమ్!**

**దధిమధుఘృతపూర్ణం తామ్రపాత్రాంతరస్థమ్ !**

**కనక రచితసూర్యం సూర్యబిమ్బాను మానమ్ !!**

**సితకుసుమసహస్రైః పూజయేదిద్దుబిమ్బమ్ !**

**హరతి దురితసఙ్ఘం పర్వకాలే శశాఙ్క!**

**హరతి సకలదోషం సర్వదా తిగ్మరోచి !!**

**తాత్పర్యం:**–చండేశ్వరుని వచనానుసారము పెరుగు, తేనె, రసం, చంద్రుని ప్రమాణముతో వెండి ప్రతిమను ఇత్తడి పాత్రలో నుంచి మూతవేసి, సూర్యబింబ ప్రమాణముతో బంగారపు బింబమును తయారు చేసి పెరుగు, తేనె, నెయ్యితో కూడిన పూర్ణ పాత్రలో బింబము నుంచి ఇత్తడి పాత్రతో మూతవేసి చంద్రునికి ఒక వెయ్యి తెల్లని పువ్వులతో సూర్యునికి ఎరుపు రంగు పూవులతో వస్త్రము పూర్వకాలంలో పూజ చేసిన గ్రహణము వలన కలుగు అరిష్టము తొలగును.

★★గ్రహణము తర్వాత ఏడు దినములోపల కలుగు ఉత్పాతముల ఫలము వారాహీయే –

(బృ.సం 5 అ 92 – 95 శ్లో)★★

శ్లోకం|| ముక్తే సప్తవాహనః పాంసునిపాతో నృనసంక్షయం కురుతే!

నీహారే రోగభయం భూకన్పు: ప్రవరన్న (ప) మృత్యుః!!

ఉల్కామన్రి వినాశం నానావర్ణాఘనాశ్చ భయమతులమ్!

స్తనితం గర్భవిపత్తం విద్యున్నపదంఎ పరిపీడామ్!!

పరివేషో రుపీడాం దిగ్దాహో నృపభయం చ సాగ్నిభయమ్ !

రూక్షో వాయుః ప్రబలశ్చారసముత్థం భయం ధత్తే !!

నిరాతః సురచాపం దణ్ణశ్చ కుద్భయం సపరచక్రమ్!

గ్రహయుద్దైన్నృపయుద్ధం కేతుశ్చ తదైవ సందృష్టః!!

అవికృత సలిలనిపాతే సప్తాహనః సుభిక్షమాదేశ్యమ్!

యశ్చాశుభం గ్రహణజం తత్సర్వం నాశముపయాతి!!

**తాత్పర్యం:**–ఆచార్య వరాహ మిహిరుడి విధముగా తెలిపెను. గ్రహణమోక్షమైన తర్వాత ఎడు దినములలో ధూళివర్షముగా కురిసిన అన్ననాశనము. నీహార (మంచువర్షము, మైన రోగభయము, భూకంప మైన రోజు మరణము, ఉల్కాపాతమైన మంత్రినాశము,నానా వర్ణములతో మేఘములున్న అధికభయము, మేఘగర్జనయైన గర్భనాశము విద్యుత్ పాత (పిడుగు)మైన రాజు, సర్పము, సూకరాదులకు పీడ, పరివేషయైన రోగపీ దిగ్దాహమైన రోజు, లేక అగ్నివలన భయము, ప్రచండ వాయువు వీచిన దొంగ భయము, నిర్ఘాతమైన (సుడిగాలి) ఇంద్రధనుస్సు కనబడిన, వాయు సంఘర్షణమై దుర్భిక్షం, ఇతర సేనలవలన భయము, గ్రహయుద్ధములేక కేతు దర్శనమైన రాజు మధ్య యుద్ధము, నిర్మల జలముతో వర్షము కురిసిన సుభిక్షము కలుగున గ్రహణములో నుత్పన్నమైన దోషము నాశనమగును.

గ్రహణేభోజననిషేధః – గ్రహణసమయముభోజన నిషేధము

శ్లోకం|| చన్ద్రగ్రహే త్రియామార్వాక్ సూర్యేయామచతుష్టయమ్!

అన్నపానాదికం వర్జ్యం బాలవృద్ధాతురైర్వినా!!

**తాత్పర్యం:**–చంద్ర గ్రహణంలో మూడు యామముల (ప్రహర) పూర్వము సూర్యగ్రహణం నాలుగు యామములకు ముందు అన్న పానాదులను, బాలురు ముసలివారు రోగులు కాక మిగిలిన వారు గ్రహించరాదు.

**శ్లోకం|| సూర్యగ్రహే తు నాశ్నీయాత్పూర్వే యామచతుష్టయమ్!**

**చన్ద్రగ్రహేతు యామాంస్త్రీన్ వృద్ధబాలాతురైర్వినా!!**

**తాత్పర్యం:–** సూర్యగ్రహణం సమయం లో నాలుగు ప్రహరల ముందు, చంద్రగ్రహణం సమయములో మూడు ప్రహరలముందు బాలురు, వృద్ధులు రోగులను వదిలి మిగిలిన వారు భోజనము చేయరాదు

**సేవా సూర్యోదయే (జ్యో.ని 85 పృ)**

**శ్లోకం|| నాద్యాచ్చతుస్త్రీన్ప్రాక్ యామాన్ రవీన్దుగ్రహయామయోః**

**గ్రహకాలేచనాశ్నీయాత్ స్నాత్వాశ్నీయాచ్చ ముక్తయోః||**

**తాత్పర్యం:–**సేవా సూర్యోదములో ఈ విధముగా తెలిపెను. సూర్యగ్రహణములో నాలుగు ప్రహరల పూర్వము, చంద్రగ్రహణం మూడు ప్రహరల పూర్వము భోజనము చేయరాదు. గ్రహణమోక్షణమైన తర్వాత స్నానము భోజనము చేయవచ్చును.

**(జ్యో.ని. 85 పు)**

**శ్లోకం|| గ్రస్తాస్తే 2 న్యదినే దృష్ట్వా శ్నీయాద్వృద్ధాతురం వినా|**

**వేధో వృద్ధాతురస్త్యర్భపుత్రిణాం యామయుగ్మకమ్||**

**తాత్పర్యం:–** గ్రస్తాస్త గ్రహణమైన తర్వాతి దినమున వృద్ధులు, రోగులను వదిలి మిగిలినవారు భోజనము చేయవలెను. వృద్ధులు, రోగులు, స్త్రీలు, బాలుర కొరకు రెండు ప్రహరలవరకే వేధ, తర్వాత వారు భోజనము చేయవచ్చును.

**శ్లోకం|| శీతముష్ణోదకాత్పుణ్యం అపారక్యం పరోదకాత్|**

**ఉష్ణోదకే పి చ స్నాయాత్ గ్రహణే చన్ద సూర్యయోః "**

**తాత్పర్యం:–**ఉష్ణోదక స్నానం ఆతుర విషయమ్ ఉష్ణ జలముకన్న శీతల జలము పుణ్యదాయకమగును. నదీజలము కన్న సము జలము పుణ్యప్రదము. అయినప్పటికి గ్రహణములో ఉష్ణజలముతో స్నానము చేయవలసి. ఉష్ణ జల వినియోగం రోగులకు వృద్ధులకు మాత్రమే తెలుపబడిన

**హారీతస్మృతా (జ్యో.ని 91 వృ 1 శ్లో)**

**శ్లోకం|| సర్వేషామేవ వర్ణానాం సూతకం రాహుదర్శనే|**

**సచైలం తు భవేత్ స్నానం శృతమన్నం వివర్జయేత్||**

**తాత్పర్యం:**–హరీత స్మృతివచనానుసారము సమస్త వర్ణములవారికి రాహు దర్శనం సూతకమగునపుడు ధరించిన వస్త్రములతో స్నానము చేసిన, వండిన అన్నం త్యాగము చేసిన పుణ్యము కలుగును.

**పరాశరః**

**శ్లోకం|| ఖలయజ్ఞే వివాహే తు సఙ్క్రాన్తౌ గ్రహణే తథా|**

**శర్వర్యాం దానమస్త్యేవ నాన్యత్ర తు విధీయతే||**

**తాత్పర్యం:**– ఋషి పరాశరమతానుసారము దుష్ట యజ్ఞము, వివాహము, సం| గ్రహణములతో రాత్రిలో దానము చేయు విధానమున్నది. దీనికి వ్యతిరేక రాత్రిలో దానము నిషేధింపబడినది.

**శ్లోకం|| మరుతో వసవోరుద్రా: ఆదిత్యాశ్చాడ దేవతాః|**

**సర్వే సోమేన తీయస్తే తస్మాద్దాను తుసఙ్గ్రహే||**

**తాత్పర్యం:**–మరుత్తు, వసువు, రుద్రుడు సూర్య దేవతలు చంద్రునితో విలీనమగును ఈ సందర్భముగా సంగ్రహ దానం చేయవలెను.

**నిబందసారే(జ్యో.ని.91పృ)**

**శ్లోకం|| ఆదిత్యేహని సంక్రాంతౌ గ్రహణే చన్ద సూర్యయోః!**

**పారణం చోపవాసం చ న కుర్యాత్పుత్రవాన్ గృహో!!**

**తాత్పర్యం:**–నిబంధ సారమునునుసరించి రవివారము, సంక్రాంతి, సూర్యచంద్ర గ్రహణములలో పారణము (ఉపవాసముండి మర్నాడు భోజనము చేయుట) ఉపవాసము పుత్రులతో కూడి గృహస్థుడు చేయకూడదు.

**అశుచే: రజస్వలాయాః స్నానము –**

**అపవిత్ర రజస్వలకు గ్రహణ స్నానం తెలియజేయబుతున్నది**

**శ్లోకం|| స్నానే నైమిత్తికే ప్రాప్తే నారీయది రజస్వలా!**

**పాత్రాన్తరితతోయేన స్నానం కృత్వావ్రతం చరేత్!!**

**తాత్పర్యం:**– గ్రహణ సమయములో రజస్వల యైన స్త్రీ నైమిత్తిక స్నానము చేయవలసి వచ్చినపుడు పాత్రలోనున్న జలముతో స్నానము చేసి వ్రతమునాచరించవలెను.

**శ్లోకం|| సిక్తమాత్రా భవేదద్భిః సాపాటౌ కథఞ్చన!**

**న వస్త్రపీడనం కుర్యాన్నాన్య ద్వాసాంశ్చ ధారయేత్!!**

**తాత్పయం:–**అభిషిక్త జలముతో సాంగోపాంగముగా తడిచిన రజస్వలయైన కన్య వస్త్రములను పిండవలెనుకాని అన్య వస్త్రములను ధరించరాదు.

**స్మృతిరత్నావల్యామ్ (జ్యో.ని. 91పృ)**

**శ్లోకం|| గ్రహపర్యుషితం చాన్నం భుక్త్వా చానాయణం చరేత్!**

**పిత్వా తథోదకం విప్రః పశ్చాత్కృచ్ఛం సమాచరేత్!!**

**తాత్పర్యం:–**స్మృతి రత్నావళిలో తెలుపబడెను. గ్రహణములో నుంచబడిన అన్నము తినిన చాంద్రాయణ వ్రతము, నీటిని త్రాగిన కృచ్ఛదానము చేయవలెను.

**సఙ్గ్రహే – (జ్యో.ని 61 పూ) –**

**శ్లోకం|| చంద్ర సూర్యగ్రహే యస్తు స్నానం దానం సురార్చనమ్ !**

**న కరోతి పితుః శ్రాద్ధం చ నరః పతితో భవేత్!!**

**తాత్పర్యం:–**సంగ్రహ గ్రంథానుసారము సూర్య చంద్ర గ్రహణములలో స్నాన దానములు : దేవ పూజనము, పితాశ్రద్ధము చేయని వ్యక్తి పతితుడగును.

**ఉక్తణ్యరామః – రామదైవజ్ఞుని వచనము**

**ముహూర్తచింతామణి – (4 ప్రశ్లో)**

**శ్లోకం|| జన్మ క్షే నిధనం గ్రహే జనిభతో ఘాతః క్షతి:**

**శ్రీర్వ్యథా చినా సాఖ్యకలత్రదాస్యమృతయః స్యుర్మానవాశః సుఖమ్**

**దానం శాన్త్రథో గ్రహం త్వశుభదం నో వీక్ష్యమాహుః పరే**

**తాత్పర్యం:–**ముహూర్త చింతామణి వచనానుసారము జన్మనక్షత్రములో గ్రహణ ఆయువుకు సంకటమేర్పడును. జన్మరాశిలోనైన శరీర పీడ, ద్వితీయంలో ధననాశము, తృతీయములో ధనలాభము, చతుర్థములో శరీరపీడ, పంచమః పుత్రాది చింతా, షష్ఠమంలో సుఖము, సప్తమములో పత్నీ మరణం, అష్టమ మరణము, నవమములో వినాశము, దశమములో సుఖము, ఏకాదశములో లో ద్వాదశములో గ్రహణమైన మృత్యువు ద్రవ్యనాశము కలుగును.

**దైవజ్ఞమనోహరేపి – (ము.చిం. 4 ప్ర. 6 శో పి.టీ)**

**శ్లోకం|| ఘాతం హానిమథ శ్రియం జననభాధ్వస్తిం చ**

**చింతా క్రమాత్ సౌఖ్యం దారవియోజనం చ**

**కురుతే వ్యాధిం చ మానక్షయమ్ సిద్ధిం**

**లాభమపాయమర్క శశినొ: షాణ్మాస మధ్యగ్రహే**

**దుష్టం సుష్టుతరం దదాతి చ ఫలం గర్గాదిభిః కీర్తితమ్ 82**

**తాత్పర్యం:–**దైవజ్ఞమనోహర నానుక గ్రంథానుసారము జన్మరాశిలో గ్రహణమైన ఘాతుకం, ద్వితీయములో హాని, తృతీయములో ధనలాభము, చతుర్థములో ధ్వంసం, పంచమములో పుత్రచింత, షష్ఠమములో సుఖము, సప్తమములో స్త్రీ వియోగం, అష్టమములో రోగము, నవమములో అగౌరవము, దశమములో సిద్ధి, ఏకాదశములో లాభము, ద్వాదశములో గ్రహణమైన అపాయము కలుగును. గర్గాదిమునుల వచనానుసారము ఆరు మాసములకు రెండవ గ్రహణమైనపుడు మొదటి గ్రహణము యొక్క దూషితఫలము శుభమునిచ్చును.

**లల్లాస్తు– (ము.చిం. 4 16 శో పీ.టీ.)**

**శ్లోకం|| గ్రాసాత్తృతీయే ప్రమగశ్చతుర్థస్తథాయ సంఖ్యాశుభదః స్వరాశి:|**

**సుతాజ్మాడక్ష్వాదశగశ్చ మధ్యా తథానమశ్చాద్య రిపుద్విసప్త ||**

**తాత్పర్యం:–**లల్లాచార్యుని మతానుసారము గ్రహణమున్నరాశి నుండి 3, 8, 4, రాశులలో స్వరాశియున్న శుభము, 5, 6, 10, 12 రాశులలోనున్న మధ్యవ 1, 6, 2, 7 రాశులలోనున్న దూషిత ఫలము కలుగును.

**గర్గోపి గరునివచనము**

**శ్లోకం|| శుభాష్టాయచతుస్త్రీణి మధ్యోన్యేషునవాస్తగః |**

**నిన్యారీదశపక్షేకం గ్రాసాద్రాశిం వదేబుధః||**

**తాత్పర్యం:–**గరాచార్యవచనానుసారము గ్రహణరాశి నుండి స్వరాశి 8, 11, 4, 3 యైన శుభము, 12, 5, 9, 7 యైన మధ్యమము, 6, 2, 10, 1 లో నున్న దుష్టఫలము కలుగును.

**పితామహ సిద్ధాన్త – (ము.చి. 4 ప్ర 11 శ్లో పీ.టీ.)**

**శ్లోకం|| సర్వై: పట్టకైతం వీక్ష్యం స్వస్తం తైలామ్బుదర్పణే|**

**గ్రహణం గుర్వీణీ జాతులు న పశ్యేత్తు పటం వినా||**

**తాత్పర్యం:–** పైతామహ సిద్ధాంతానుసారము జనులందరు కాష్టపఠముపై కూర్చొని ఆకాశములోనున్న బింబమును నూనె, నీరు, లేక దర్పణములో చూచెదరు. కాని గర్భిణీ స్త్రీ ఏ విధంగా కూడా గ్రహణ చూడరాదు, వస్త్రము ను చాటు చేసుకొని చూచిన దోషము లేదు.

**శ్లోకం|| దానఖణే గోదానాత్స్యూర్యలోకం ప్రజతి**

**శివపురం ధేనుపుత్రస్యదానా దైశ్వర్యం**

**హేమదానాత్సకలవసుమతీనాయకో**

**నాగదానాత్ వైకుణం చాశ్వదానాద్**

**ప్రజతి హిమనుజో నాగదో బ్రహ్మలోకం**

**భూదానాద్ భూపతిత్వం సకల**

**సుఖయుతో జాయతే చాన్నదానాత్ ||**

**తాత్పర్యం:**–దాన ఖండములో ఈ విధముగా తెలిపెను. గో దానం వలన సూర్యలోకములోప్రాప్తి, ఎద్దు దానము వలన శ్లోకం, సువర్ణ దానము వలన ఐశ్వర్యము, సర్ప దానము వల్ల నాయకత్వము, గుర్రపు దానము వలన వైకుంఠము, నాగ దానము వలన బ్రహ్మలోకము, భూదానముతో రాజపదము, గ్రహణములో అన్న దానం చేయుటవలన సుఖప్రాప్తి కలుగును.

**దాననిర్ణయే**

**వశ్యార్థి చన్దనం దద్యాత్ సుగన్ధిద్రవ్యమేవ చ|**

**రౌప్యదానాత్సురూపత్వం వస్త్రదానాన్మహద్యశః||**

**అన్నదానాత్సమృద్ధిః స్యాద్ గోదానాదీప్సితం ఫలమ్|**

**శివలోకే సుఖం చైవ వృషదానాత్తథా ధనమ్||**

**ఫలదానాత్సుత ప్రాప్తిర్ఘృతం సౌభాగ్యవర్ధనమ్|**

**లవణం దుర్జనాన్ష సువర్ణం సర్వసమ్పదమ్||**

**భూదానాద్ భూపతిత్వం చ గజదానాత్తథైవ చ|**

**అశ్వదానాత్స్వర్గ సుఖమారోగ్యార్థే స్వమౌషధమ్||**

**తాత్పర్యం:**–దాన దర్పణములో తెలుపబడెను, వశీకరణము కొరకు చందనము సుగంధియుక్త పదార్థము, వెండి దానము సుందర స్వరూపము, వస్త్ర దానం గొప్ప యశము, అన్నదానముతో సంపద, గోదానముతో అభీష్ట ఫలము, గుర్రపు దానము శివలోక సుఖము ధనము ఫలదానముతో పుత్రప్రాప్తి ఘృత దానము గజదానములతో రాజ్యపదప్రాప్తి, గుర్రపు దానము స్వర్గ సుఖము, ధన దానము సౌభాగ్యవృద్ధి లవణదానముతో శత్రునాశము స్వర్ణదానముతో అభీష్టసిద్ధి, భూగజ దానములతో రాజ్యపదప్రాప్తి, గుర్రపు దానము స్వర్గ సుఖము, ధన దానము గ్రహణములో చేయుట వలన ఆరోగ్యము కలుగును.

**అథ శుభాశుభ గ్రహణమాహ వసిష్ఠః (వ.సం. 36 అ 1 శ్లో)**

**శుభాశుభగ్రహణముల గూర్చి వసిష్ఠవచనము**

**శ్లోకం|| యస్యైవ జన్మనక్షత్రే గ్రస్యేతే శశిభాస్కరౌ|**

**తస్య వ్యాధిభయం ఘోరం జన్మరాశౌ ధనక్షయ||**

**తాత్పర్యం:**–వశిష్ఠ వచనానుసారము జన్మనక్షత్రము సూర్య చంద్ర గ్రహణములైన రోగభయము

**ధనక్షయమగును. – భార్గవీయే – (ము.చి. 4 ప్ర 6 శో పీ.టీ)**

**శ్లోకం|| యస్య రాజ్యస్య నక్షత్రే స్వర్భానురూపయుజ్యతే|**

**రాజ్యనాశం సుహృన్నాశం మరణం చిత్ర నిర్దిశేత్||**

**తాత్పర్యం:**–ఏ రాజ్యనక్షత్రముతో గ్రహణమగునో ఆరాజ్యములో మిత్రుల నాశము మరణము గమ కలుగునని భార్గవుని వచనము. –రాజ్యస్య నక్షత్రే రాజ్యాభిషేకనక్షత్రే ఇక్కడ రాజ్యనక్షత్రము కన్న రాజ్యాభిషేక నక్షత్రమును గ్రహించవలెను.

**నారదః – (ము. చి 1 1 33 శో షీ.టీ)**

**శ్లోకం|| గ్రస్తాస్తే త్రిదినం పూర్వం పశ్చాద్ గ్రస్తోదయే తథా!**

**ఖణ్డగ్రాసే తు త్రిదినం నిఃశేషే సప్త సప్త చ!!**

**తాత్పర్యం:**–నారదుని వచనానుసారము గ్రస్తాస్తములో మూడు దినముల ముందు మూడు దినములు తర్వాత ఖండ గ్రహణములో మూడు దినములు, సంపూర్ణ గ్రహణములో ఏడు దినములు ముందు ఏడు దినములు తర్వాత శుభ కార్యములను చేయరాదు.

**కశ్యపః – (ము.చిం 11 33 శో పి.టీ)**

**శ్లోకం|| గ్రస్తోదయే పరో దోషో గ్రస్తాస్తే 2 ర్వాక్ శశీనయో!**

**ద్యునిశార్ధే భయం స్యాత్తు ఖజ్జే ఖణ్డవ్యవస్థయో !!**

**తాత్పర్యం:**–కశ్యపుని వచనానుసారము గ్రస్తోదయములో తర్వాత దోషమగును, గ్రస్తాస్తములో ముందు, ఖండ గ్రహణంలో అదే రోజున దోషమగును.

**(జ్యో.ని 85 పు)**

**శ్లోకం|| న సూతకాది దోషోత్ర దానహోమజపాదిషు!**

**గ్రస్తేస్నాయాదుదక్యాపి తీర్థాదుధృతవారిణా!!**

**తాత్పర్యం:**–దాన, జప, హోమములు చేయుటకు గ్రహణములో సూతకం ఏ విధమైన బాధను కలిగించదు. స్పర్శ జరిగినపుడు ఋతుమతియైన స్త్రీ కూడ తీర్థము నుండి వచ్చు నీటితో స్నానము చేయవచ్చును.

**మేషాది రాశిషు గ్రహణఫలం**

పాంచాల కళింగశూరసేనాః కాంభోజాంధ్రకిరాత శస్త్రవాతాః జీవంతి చ యేహుతాశవృత్యా తే పీడా ముపయాంతి మేష సంస్థే|గావః పశవోధ గోమిథునం మనుజా యేచ మహత్వమాగతాః తే పీడాముపయాంతి భాస్కరే గ్రస్తే శీతకరేపి వా వృషే||మిథునే ప్రవరాంగనా గృహోనృపమాత్రాబలినః కలావిదః యమునాతటజా స్సబాహ్లికాః కురుమత్స్యాస్సజనై స్సమన్వితాః|అభీరాన్ శబరాన్ సపహ్నవా న్మ్లాన్మేచ్ఛకురంజికానపి: పాంచాలాన్వికలాంశ్చ పీడయేత్ నచాపి నిహంతికర్కటే| సింహే పులిందగ మేఘలసత్యయుక్తా జావధూన్నందనవరివనగోచరాంశ్చ|షష్వేతుసస్యమపి లేఖకగేయసకాన్పలంత్యశ్మక త్రిపురశాలియుతాంశ్చ దేశాన్ |తులాధరేవంత్యపరాంశ్చ సాధూన్ వణిగ్దశార్థాం|శృచరుకచ్ఛకాంశ్చ ఆశివ్యధోదుంబర మద్రచోలాన్ద్రుమాంశ్చయోధి విషమా యుధీయాన్॥ ధన్వన్యమాత్యవరవాజి విదేహమల్లాన్ పాంచాల వైద్యవణిజో విషమాయుధజ్ఞాన్ హన్యాన్మృగేతు ఋషమంత్రి తిలాని నీచాన్ మంత్రాషధేషు కుశలాన్ స్థవిరాయుధీయాన్ || కుంభేంతర్గిరిజాన్ నపశ్చిమజనాన్ భారోద్యహాన్ తస్కరా నాభీరాన్ ధనధాన్యసింహ పురకాన్ హన్యా తథా బర్బరాన్ || మీనే సాగరకూలసాగర జలద్రవ్యాణి వన్యాన్ జనానాజ్ఞాన్వార్యుపజీవిన శుభఫలం కూర్మోపదేశాద్వదేదితి||

**గ్రహణే వర్ణ ఫలం**

శ్వేతేరాహౌ సర్వదేశే సుభిక్షం స్యాత్పీతాభే భూసురాణాంచ పీడా! అంగారాభే వహ్నిపీడా తదాసా త్వాలాశాఖే క్షుద్భయం సస్యపీడా! శబరాణాంతు కపిలేవర్లే సర్వభయం వదేత్! రవిరశ్మిసమాభేతు పక్షిపీతా త్వనర్థతా ధూమ్రకాలేల్పవృష్టిస్స్యాత్తథాపి క్షేమవాన్ జనః కపోతారుణతుల్యాస్యా చ్ఛ్యామోవా క్షుద్భయంక హరిన్మణినిభో వైశ్యధ్వంసి చార్ఘప్రదో భువి! దూర్వా బోధహరిద్రాభో లోకానా మామయప్రదః గైరికా మహద్యుద్ధం విద్యద్వర్ణేనలాద్భయం! అతికృష్ణనిభే వ్యాధి శూద్రాణాం చ నృపాద్భయం! పాటలకుసుమసమా స్వనలాద్విప్రదో రాహుః పంకమివ రూషితమివ రాహుః క్షత్రియ కులనాశద స్వవృష్టికర ఇతి! గ్రాసభేదా దశవిధా మోక్షభేదా త్తథాదశ శక్తా

వీక్షితుం దేవాః కింపునః ప్రాకృతాజనా ఇతి అత్ర వసిష్ఠ సవ్యాపసవ్యలేహ్యా గ్రాసననిరోధవిమర్దనారోహణ ఆఘ్రాతం మధ్యతమ స్తమోంత ఇతి తే దశగ్రాసాని సవ్యేగ తమసిసతి సవ్యగ్రాసశ్శుభప్రదో జగతః అపసవ్యే తమసిసతి త్వపనవ్యాఖ్య క్షితిసంక్షోభః పరితో జిహ్వావి స్పంగ్రాసో మండలస్య లేహ్యం త! ప్రతీప మఖిలజనానాం సువృష్టిదం సర్వసస్యానాం! స్యాదర్ధాదిషుమాన– యత్తన్నామగ్రసనం తథా! నానావిధగతైశ్చోరైః పీడ్యంతే నిఖిలాజనాః స్పర్శవిమర్దాన్మోక్షవిమర్ద మధికం యడా భవతి ననిరోధో విజేయ స్త్వనిష్టద స్పర్వభూతానాం॥ అపమర్దన నిశ్శేషమితి నిశ్శేషమేవ సంఛాద్యయ. చిరంతిస్టేతే! హన్యాశ్చాన దేశాన్త్రధానదేశభూతాంశ్చ తిమిరమయం! వృత్తే గ్రహేయది తమస్తకక్షణ మావృత దృశ్యతేభూయణ ఆరోహణ మన్యోన్యమర్దనై ర్భయంకరం రాజ్ఞం! దర్పణమివైక దేశబాష్పనిశ్వా మారుతోపహతం దృశ్యత ఋతంత త్సువృష్ట్యవృష్ట్యాప హతం జగతః మధ్యతమప్రవిష్టం వితమస్క మండలం చ యదిపరతః తన్మధ్యదేశనాశం కరోతి కుక్ష్యామయం భయం చ. పర్యంతేష్వతి బహుళ స్వచ్ఛం మధ్యతమస్తమోంత్యాఖ్యే! సస్యానా మీతిభయం భయమస్మిన్ తస్కరాణాం చేతి||

**గ్రహణశూల లక్షణం**

సంక్రాంతి గ్రహణం వాపి జన్మ న్యుభయపార్శ్వయోః! త్రికం నష్టం శుభంషట్కం పర్యాయేణ పునః పునః త్రిత్రికేఫలముద్దిష్టం రోగం శ్లోకం భయం క్రమాత్ త్రిషట్కేచ ఫలం జ్ఞేయం క్షేమలాభం సుఖం తథా! జన్మని జన్మనక్షత్రే ఉభయపార్శ్వయోః తత్పూర్వోత్తరనక్షత్రయోర్వా సంక్రాంతిర్గహణం వా భవతి తదా నక్షత్రత్రయం నష్టం తదేవ శూలమిత్యుచ్యతే! తదుత్తరనక్షత్రషట్కే గ్రహణం చేత్ క్రమం భవతి: ఏవమేవ పునఃపునః పర్యాయేణ తదేవస్పష్టీక్రియతే| త్రితికే ఫలముద్దిష్టమిత్యాదినా। ఆద్యత్రికే గ్రహణంచేద్రోగోభవతి తదుత్తరనక్షత్రషట్కే గ్రహణంచేల్లా భం భవతి తృతీయత్రికే గ్రహణం చేద్భయం భవతి! తదుత్తరషట్కే గ్రహణం చేత్సుఖం భవతీత్యర్థః జన్మర్ క్షా దధనామర్క్షా చూలదోషం భవేద్యది! యథాశక్తి సువర్ణేన త్రిశూలం కారయేత్సుధీః తామ్రపాత్రే తిలాన్క్షిప్య త్రిశూలం తత్ర నిక్షిపేత్ ! మృత్యుంజయేన మంత్రేణ పూజయిత్వా యథావిధి। రవిసంక్రమణే గ్రాసే దద్యాత్తద్దశాంతయే! దక్షిణాంచ యథా శక్తిదత్వా విప్రం విసర్జయేత్ ! గ్రాసేదేయం మోక్షకాలే సంక్రాంతౌచ యథారు చి||

**గ్రహణవేధః**

తత్ర హేమాద్రి: ఏకాదశ్యాదితో వర్జ్యం దినానాం నవకం ధృవం! మాంగళ్యేషు సమస్తేషు గ్రహణే చంద్రసూర్యయోరితి! అత్రైకాదశ్యాదిత ఇత్యేతత్సూర్యగ్రహణ విషయం చంద్రగ్రహణనిషయేతు ద్వాదశ్యాది తృతీయాంతో వేధ ఇందుగ్రహే స్మృతః ఏకాదశ్యాదిత స్సౌరే చతుర్వంతః ప్రకీర్తిత ఇతి! సౌరే సూర్యగ్రహణే స్మృత్యంతరేపి! సప్తాహం గ్రహణేతీతే తథైవానాగతే పిచ! వర్జయేచ్ఛుభకర్మాణి ఋక్షే షాణ్మాసికం తథేతి! ఇదం చాఖండగ్రహణవిషయం! ఖండగ్రహణేతు। గ్రాసతారతమ్యా నుసారేణ న్యూనాధికకాలాభిధానాత్ తథాచ హేమాద్రిః ఖండసగ్రహేతు సంప్రోక్త ముభయత్ర దినత్రయమితి! స్మృత్యంతరేషి అహః ఖండ గ్రహే తయోరితి! ఇదంచ గ్రస్తాస్తవిషయం గ్రస్తోదయవిషయం చేతి వేదితవ్యం! తదుక్తం నారదేన! గ్రస్తాస్తే త్రిదినంపూర్వం పశ్చాద్ధస్తోదయే తథా సర్వగ్రస్తేతు సప్తాహం వర్జయిత్వాదితస్తథేతి యస్మిన్ దినే ఉత్పాతో జాయతే తద్దినాదారభ సప్తాహం వర్ణ్యమిత్యర్థః స్మృత్యంతరేపి గ్రస్తాస్తమానే సప్తాహం పంచాహం త్వర్ధతోధికే! గ్రాసార్ధోనేత్రహందోష శ్చంద్రసూర్యగ్రహ త్వరమితి! గ్రస్తోదయ గ్రస్తాస్త వ్యతిరిక్త శుద్ధ గ్రహణ విషయేతు గ్రహణాదూర్వమేవ వర్షత్వముక్తం: తథా చ స్మృత్యంతరం! పశ్చాదేవోపరాగేతు దోషస్స్యాన్నైవ పూర్వతః గృహదాహాదయో దోషా: యదాస్యుర్దహనా త్వరమితి! ఏతత్సర్వమభిప్రేత్య వృద్ధవసిష్ఠోప్యాహం సప్తాహమూర్ధ్వంగ్రహణా దఖండాత్లండాత్తదర్ధం దినపంచకం వా గ్రస్తోదయే చోర్ధ్వమనిష్ఠమాదౌ గ్రస్తాస్తమానే ప్యుడుమాసషట్కమితి: అత్ర పూర్వార్ధ శ్శుద్ధగ్రహణ విషయః ఉత్తరార్ధో గ్రస్తోదయగ్రస్తాస్తవిషయః సప్తాహం సర్వసే తదరం సాధతిదినం దినపంచకం త్రిపాదగ్రాసే: అపిశ్ఠ స్సముచ్చయార్ః గ్రస్తోదయే గ్రహిస్తమానేసి ఊర్వమాదౌ చ మంగళ కార్యేష్యనిష్టం! ఉ డు నక్షత్రం గ్రహణనక్షత్రం షణ్మాసపర్యంతం శుభకర్మ స్వనిష్ట మిత్యర్థు నక్షత్రమృక్షం భం తారా తారకా ప్యుడువాఀస్త్రియోమితి నైఘంటికాత్| యస్మిన్నక్షత్రే గ్రహణం భవతి తస్మిన్నక్షత్ర గ్రహణానంతరం షణ్మాసపర్యంతం శుభకర్మాణి నకుర్యాదిత్యర్థః వర్జయేచ్ఛుభకర్మాణి ఋక్షే షాణ్మాసికం తదేతి పూర్వోక్షస్మృత్యంతరవచనాచ్ఛ) జ్యోతిర్నింబదేపి- గ్రహణోత్పాతజం త్యాజ్యం మంగళేషు ఋతుత్రయం! యావచ్ఛరవిణాభుక్త్వా ముక్తమంథగ్ధకాలవదితిః శుద్ధ గ్రహణవిషయే విశేషమాహ గరు సంధ్యాయాం త్రిత్రిదినం రవీందు గ్రహణాత్పరం! నింద్యం నిశార్ధేశుభయతః ఖండాఖండవ్యవస్థయేతి సంధ్యాయాం రవీందు గ్రహణం చేదూర్వం త్రిత్రిదినం నవదినం నింద్యం, శుభకర్మ స్వశేషతు నిశార్ధమర్ధరాత్ర మిత్యర్థః యది తత్ర గ్రహణం భవతి తదా ఉభయతు పూర్వోత్తరకాలయో: పూర్ణగాసాది తారతమ్యానుసారేణ సప్తాహాదికం నింద్యం త్ర శుభకర్మ నకుర్యాదిత్యర్థు ఇవి శ్రీ కాలనిర్ణయచంద్రికాయాం గ్రహణనిర్ణయణ!!

## సూర్యచంద్రగ్రహణే పటేన బింబదర్శనం

పశ్యంతి యే పటగతం గ్రహణం రవీంద్వోర్బ్రేద్రైశ్చతుర్ధశభిరప్యుపపన్నమేతి తే ప్రాప్నువ సమస్త కసంగపూతం గంగావగాహనఫలం విపులాంచ లక్ష్మీమితిః గుర్వీణీవిషయే విశేషో బ్రహ్మాసిద్ధా దర్శితం సర్వై: పటస్థితం వీక్ష్య స్వస్థం తైలంబు భక్షణే! గ్రహణం గుర్వీణీ జాతులు న పశ్యేత పటంవినే||

## జన్మార్ధాదా గ్రహణఫలం

తత్ర కశ్యపః యస్యైవ జన్మ నక్షత్రాలు గ్రస్యతే శశిభాస్కరా! తస్య వ్యాధి భయం ఘోరం జన్మరాశౌ జగురితి! గర్గోపి – జననభవనలగ్నా దష్టమభవ నేర్కచంద్రయోర్త్రహణం॥ తస్య భవత్య పమృత్యు శ్రీహర నిధనతారకాగ్రహణమితి, నిధనతారకా నైధనతారకా సప్తమబుక్షమితి యావత్ గ్రంథాంతరే– జ జన్మరాశౌ చ షష్ఠాష్టమగతేపివా! చతుర్థే ద్వాదశేచైవ న కుర్యాద్రాహుదర్శనమ్ రాహుదర్శన మా చార్ధహాని ర్మహద్భయం! ఇతి। అన్యచ్చక యస్యాస్తి జన్మనక్షత్ర గ్రహణం చంద్రసూర్యయోః సర్వార పరిత్యజ్య జపన్నాసేత వారిణి| జ్యోతిశ్యాస్త్రోపి – త్రిషడ్దశాయోపగతం నరాణాం శుభప్రదం స్యాద్ధమ రవీంద్వో: ద్విసప్తనందేషు చ మధ్యమం స్యాచ్ఛే షే ష్వనిష్టం కథితం మునీంద్రైరితి! ఆయ ఏకాదశ నమః ఇషు పంచ ఇమే ప్రసిద్ధః గార్గోలోపి జన్మ షష్ఠాష్టరిప్పాంక దశమస్థే నిశాకరే! దృష్టోరికా గాసురన్న క్షాన్ని ధనేపి చేతి| రిప్పం ద్వాదశం॥ అంక న వః నిధనం సప్తమ తారా! విష్ణుధర్మోత్తర యన్నక్షత్రగతో రాహుర్త్రసతే శశిభాస్కరౌ తజ్జాతానాం భవేత్పీడా యేనతాశ్శాంతివర్జితా ఇతి! గ్రంథాంతరేపి సూర్య సంక్రమణం వాపి గ్రహణం చంద్రసూర్యయోః యస్య త్రిజన్మనక్షత్రే తస్య రోగోధవామృతిః తస్య దానం చ హోమం చ దేవార్చనజ పౌ తథా! ఉపరాగాభిషేకం చ కుర్యాచ్ఛాంతి ర్భవిష్యతి! స్వర్ణేన వాధపిష్టేన కృత్వా సర్పస్య చాకృతిం బ్రాహ్మణా యాదదాత్తస్య నరోగాదిశ్చ తత్కృత ఇతి! జన్మనక్షత్రం తత్పూర్వోత్తరం చేతి! త్రిజన్మనక్షత్రమిత్యుచ్యతే॥ జన్మర్క్షం దశమర్షమేకోనవింశత్యక్షమితి కేచిత్ సర్పస్యచాకృతిం రాహోరాకృతిమిత్యర్థః! పిష్టేనేత్యేత దత్యంతాసమర్ధవిషయం॥ భార్గవోపి: యస్య రాజ్యస్యనక్షత్రే స్వర్భాను రుపరజ్యతే! రాజ్యభంగం సుహృన్నాశం మరణం చాత్రనిర్దిశేత రాజస్యనక్షత్ర మభిషేకనక్షత్రం భార్గవార్చన దీపికాయాం ! సౌవర్ణం కారయే న్నాగం పలే నార్ధపలార్థతః తదర్ధేన తదర్ధేన ఫణాయాం మౌక్తికం న్యసేత్! తామ్రపాత్రే నిధాయాధ ఘృతపూర్ణే విశేషతః కాంస్యేవా కాంతలో హేవా న్యస్య దద్యా త్సదక్షిణం చంద్రగ్రహేతు రౌప్యస్య బింబం దద్యాత్సదక్షిణం! నాగం

రుక్మమయం సూర్యగ్రహే బింబంచ హేమజం తురంగరథగోభూషితిలాస్సర్పిశ్చ కాంచనమితి చంద్రగ్రహే చంద్రబింబం రౌప్యం! సూర్యగ్రహే సూర్యబింబం సౌవర్ణం! గ్రహణద్వయేపి రాహుం రుక్మమయం కుర్యాత్ కాలవివేకేపీ సౌవర్ణనిర్మితం నాగం సతిలం కాంస్యభాజనం| సదక్షిణం సవస్త్రం చ బ్రాహ్మణాయ నివేదయేత్| సౌవర్ణం రాజితంవాపి బింబం కృత్వా స్వశక్తితః ఉపరాగభవక్లేశభీతో విప్రాయ కల్పయేదితి తత్ర మంత్రః! తమోమయ మహాభీమ సోమసూర్యవిమర్దన హేమతారాప్రదానేన మహాశాంతి ప్రదో భవ| విధంతుద నమస్తుభ్యం నెం గంగ గా మూత్రం గానే గస్వ రకమాం వేధజాదృయాత్!!

**సూర్యగ్రహణ శాంతి స్నానము**

**శ్లోకం|| తిలాంబుజోశీరకపూతికాష్టై:**
**ససర్షపక్షౌద్రశమీంద్రదూర్వై**
**సూర్యపరాగేవిషమేనరాణాం**
**భార్జ్యయుతైర్మజ్జనమిష్టదంస్యాత్!! జ్యోతిర్విదాభరణం**

**తాత్పర్యం:**–సూర్యగ్రహణమున అశుభస్థానమున కలిగినప్పుడు నువ్వులు పద్మములు వట్టివ్రేళ్ళు దేవదారు ఋషభ అను ఓషధి తేనే జమ్మి ఇంద్ర యవలు గరిక గంటు భారంగి, కలిపి స్నానము చేసిన ఆ దోషం తొలిగి శుభము ఇచ్చును.

---

**చంద్ర గ్రహణ శాంతి స్నానము**

**శ్లోకం|| పాధ:శమీకోకనదైరనిష్టే**
**విధూపరాగే తిలదారు వర్ణై:!**
**సిద్దార్థదూర్వామధుకాలమేయై**
**రనిష్టనాశాయ తు మజ్జనం స్యాత్!! జ్యోతిర్విదాభరణం**

**తాత్పర్యం:**–దుష్టస్థానమున చంద్రగ్రహణం పట్టినచో నీరు,జమ్మి,ఎర్రకలువలు,నువ్వులు, దేవ – దారు,కేసరము,తెల్లాఆవాలు,గరికలు,తేనే,నాగకేసరములు కలిపి స్నానం చేసిన దోష విముక్తి కల్గును.

# సూర్య గ్రహణం

స్వస్తిశ్రీ వికారి నామ సంవత్సర మార్గశిర బ॥ అమావాస్య గురువారం తేది: 26-12-2019 మూలా నక్షత్ర చతుర్ధ పాద సంచార సమయే కేతుగ్రస్త పాక్షిక సూర్య గ్రహణం.

**వర్ణం:-కృష్ణ వర్ణం.**

**ఫలితం:- అతికృష్ణనిభే వ్యాధి శూద్రాణాం చ నృపాద్భయం!**

**రాశి:-ధనుస్సు**

**ఫలితం:- ధన్వన్యమాత్యవరవాజి విదేహమల్లాన్ పాంచాల వైద్యవణిజో విషమాయుధజ్ఞాన్ హన్యా|**

**గ్రహణ ప్రారంభం కాలం ఉదయం॥ 08 గం॥ల 11 ని॥**

**గ్రహణ మధ్యకాలం ఉదయం॥ 09 గం॥ల37 ని॥**

**గ్రహణ మోక్ష కాలం ఉదయం॥ 11 గం॥ల20 ని॥**

ముందు రోజు అనగా బుధవారం రాత్రి 8:00 గంటల లోపు భోజనాదులు పూర్తి చేసుకుని. గ్రహణ మోక్షకాల అనంతరం యధావిధిగా నిత్యకృత్యములు చేసుకోవచ్చు.

గ్రహణం పడుతుండగా స్నానం చేసి సంపూర్ణ గ్రహణం పట్టిన తర్వాత జపము.మోక్ష అనంతరం మళ్ళీ స్నానం చేయాలి.

ఈ గ్రహణం మూలా,పుర్వాషాడ నక్షత్రాలలో సంభవించుటచే ధనుస్సురాశి జాతకులకు దోషము, మరియు వృషభ,మిధున,కన్య,మకర రాశి వారు కూడాశాంతి చేయించుకున్నమంచిది.కాబట్టి ఆ నక్షత్ర,రాశి జాతకులు గ్రహణమును చూడకూడదు.మరియు దోష నివృత్తి చేసుకోవాలి.

**దోష శాంతి కొరకు :-** గ్రహణం పూర్తి అయిన తర్వాత ఎటువంటి ఆహారం తీసుకోకుండా క్రింది విధానం ఆచరించిన దోష నివృత్తి కలుగును.

**మమ జన్మ నక్షత్ర జన్మ రాశి చతుర్ధ్యారిష్ట,స్థానస్థిత కేతుగ్రస్త పాక్షిక సూర్య గ్రహణ సూచిత సర్వారిష్ట ప్రశాంతి పూర్వక ఏకాదశ స్థానం ,స్థిత,పాక్షిక సూర్య గ్రహణ సంభవిత సంపూర్ణ దోష నివృత్యర్థం యథాశక్తి కల్పోక్త ప్రకారేన బింబదానం కరిష్యే॥.**

అని సంకల్పం చెప్పుకుని

**శ్లోకం|| తమోమయ మహాభీమ సోమసూర్య విమర్దన।**
**రజత బింబ ప్రదానేన మామ శాంతి ప్రదోభవ॥**

**శ్లోకం|| విధున్తుద నమస్తుభ్యం సింహికా నందనాచ్యుత।**
**దానేనానేన నాగస్య రక్షమాం వేదజాద్భయాత్॥**

**శ్లోకం|| సింహికేయ మహావీర సోమసూర్య నిరోధక।**

**మద్రాశి జనితం శూల పాపమాశు వినాశయ||**

అను మంత్రము చదువుతూ గ్రహణ దోష నివృత్తి కొరకు గ్రహణ సమయములో సూర్య,కేతు గ్రహములకు జపములు చేసుకొనుట మంచిది.మరునాడు ఉదయం వెండితో చేయించిన సూర్య బింబము, పాము పడగలను శివలింగము పై ఉంచి రుద్రాభిషేకము చేసుకుని నూతవస్త్రంలో ధాన్యముపోసి వానియందు సూర్యబింబము, పాముపడగ ఉంచి బ్రాహ్మణునకు దానము ఇవ్వాలి. నేతితో కూడిన కంచు పాత్రనుకూడా దానంగా ఇవ్వాలి.

---

సూర్య గ్రహణం సమయంలో చాలామంది నది స్నానం చేసి.. నది తీరాన జపం చేసుకుంటారు. అలా చేస్తే మంచి ఫలితం ఉంటుందని నమ్మకం. గ్రహణ స్పర్శ కాలంలో నదీ స్నానం, మధ్యకాలమున తర్పణం, జపం, హోమం, దేవతార్చన, విడుపు కాలంలో దానం, స్నానం చేస్తే మంచిది.

సూర్యగ్రహణం అంటే తెలుసు కదా.. జ్యోతిష్య శాస్త్రం ప్రకారం.. చంద్రుడు.. రాహువు లేదా కేతువు స్థానంలో ఉన్నప్పుడే సూర్యగ్రహణం ఏర్పడుతుంది. సైన్స్ ప్రకారం.. సూర్యుడికి, భూమికి మధ్యలో చంద్రుడు రావడవ వల్ల సూర్యగ్రహణం ఏర్పడుతుంది. అయితే.. ఎంత పెద్ద సూర్య గ్రహణం అయినా.. 8 నిమిషాలకు మించి ఉండదు. పూర్తి సూర్యగ్రహణం అయినా అంత సేపే ఉంటుంది. ఆ సమయంలో సూర్యుడు మనకు కనిపించదు. ఆసమయంలో ఉష్ణోగ్రతలు కూడా తగ్గిపోతాయి. అయితే.. సూర్య గ్రహణం సమయంలో చాలామంది నది స్నానం చేసి.. నది తీరాన జపం చేసుకుంటారు. అలా చేస్తే మంచి ఫలితం ఉంటుందని నమ్మకం. గ్రహణ స్పర్శ కాలంలో నదీ స్నానం, మధ్యకాలమున తర్పణం, జపం, హోమం, దేవతార్చన, విడుపు కాలంలో దానం, స్నానం చేస్తే మంచిది. ఇలా.. సూర్యగ్రహణం రోజు చేసే పనుల వల్ల ఇన్ని లాభాలు ఉంటాయి.

అయితే.. అదే సూర్యగ్రహణం రోజున కొన్ని పనులు చేయకూడదట. ఆ పనులు చేస్తే అంతే. జీవితాంతం పేదరికమే వెంటాడుతుందట. సూర్యగ్రహణానికి 12 గంటల ముందును వేదకాలం అంటారు. ఆ సమయంలో చాలా జాగ్రత్తగా ఉండాలట. ఈ వేదకాలం సమయంలో ఆహారం తీసుకోకూడదు. ముఖ్యంగా చిన్నపిల్లలు కానీ.. వృద్ధులు కానీ ఆసమయంలో అన్నం తినకూడదు. వేదకాలాన్ని మూడు లేదా ఆరు ముహూర్త కాలంగా విభజిస్తారు. వేద కాలంలో భోజనం చేస్తే దరిద్రం వస్తుందట. అంతే కాదు.. వేదకాలం సమయంలో నిద్ర కూడా పోకూడదట. మూత్రం కూడా పోయకూడదట. వేదకాల సమయంలో వీటిని చేస్తే జీవితాంతం పేదరికం వెంటాడటమే కాదు.. దరిద్రమట.

జ్యోతిషశ్శాస్త్రం ప్రకారం.. చంద్రుడు, రాహువు లేదా కేతువుస్థానంలో ఉన్నప్పుడు మాత్రమే సూర్యగ్రహణం ఏర్పడుతుంది. పూర్తి సూర్యగ్రహణ సమయం 8 నిమిషాలకు మించి ఉండదు. సూర్యుడికి, భూమికి మధ్య చంద్రుడు రావడం వల్లనే సూర్యగ్రహణం ఏర్పడుతుంది. దీంతో భూమిమీద కొంత భాగానికి సూర్యుడు కనిపించకుండా పోతాడు. సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించే సమయంలో స్థానిక ఉష్ణోగ్రతలు కూడా భారీగా తగ్గిపోయే అవకాశం ఉంటుంది.

ఆధ్యాత్మికంగా గ్రహణం సమయానికి చాలా విశేషముంది. గ్రహణం పట్టగానే నదీ స్నానం ఆచరించి, నదీ తీరాన జపం చేసుకుంటే ఫలితం ఎక్కువగా ఉంటుందని అంటారు. గ్రహణ స్పర్శ కాలంలో నదీస్నానం, మధ్యకాలమున తర్పణం, జపం, హోమం, దేవతార్చన, విడుపు కాలంలో దానం, స్నానం చేయడం మంచిది. గ్రహణ కాలంలో భాగవన్నామస్మరణ చేయటం ఉత్తమం. గురువు ఉపదేశించిన మంత్ర జపం, వశీకరణం, శత్రుపీడనం నుంచి విముక్తి లభించేందుకు, మనసు ప్రశాంతంగా ఉండేందుకు గాయత్రి మంత్ర జపం, ఏడురోజుల వరకు తప్పనిసరిగా ఆచరించాలి. గ్రహణం రోజు ఉపవాస దీక్ష చేసి, గ్రహణ సమయంలో గో భూ హిరణ్యాది దానాలు చేయాలని శాస్త్రాలు చెబుతున్నాయి.

జ్యోతిష్యశాస్త్రం ప్రకారం జన్మ నక్షత్ర, రాశులలో గ్రహణం చెడు ఫలితాలను ఇస్తుంది. ఎవరి జన్మరాశి, జన్మ నక్షత్రంలో గ్రహణం ఏర్పడితే వారికి విశేషముగా పూజలు, జపాలు, దానాలు చేసుకోవలెను. గ్రహణం పడిన నక్షత్రమందు ఆరు నెలలు ముహూర్తాలు నిషేదిస్తారు. జన్మరాశి నుండి 3,6,10,11 రాసులలో గ్రహణమైన శుభప్రధం 2,5,7,9 రాసులందు గ్రహణమైన మధ్యమం. మిగిలిన రాసులందు గ్రహణమైన అరిష్టం.

మతాంతరంలో గార్గుడు జన్మరాశి నుంచి 7,8,9,10,12 లలో గ్రహణమైతే అరిష్టమని, రాహువు జన్మ నక్షత్రం లేదా 7 వ నక్షత్రంలో ఉన్నా అరిష్టమని తెలియజేశాడు. మరొక మతాంతరంలో రాహువు ఏ నక్షత్రంలో ఉండి సూర్య,చంద్రులను మింగుతాడో ఆ నక్షత్ర జాతకులకు చెడు జరుగుతుందని వివరించాడు. మరొక మతాంతరంలో గ్రహణం త్రిజన్మ నక్షత్రాలలో అనగా జన్మ నక్షత్రానికి ముందు నక్షత్రం, వెనుక నక్షత్రాలలో పడుతుందో వారు రోగగ్రస్తులవుతారని చెప్పడం జరిగింది. సూర్యగ్రహణ ప్రభావం ఆరు నెలల వరకు ఉంటుంది.

సూర్యగ్రహణ దోష నివారణకు దానం, హోమం, జపం,దేవతార్చన, అభిషేకం, శక్తి కలిగినవాళ్లు బంగారంతో చేసిన నాగప్రతిమ, శక్తి లేనివారు శిలతో చెక్కిన లేదా పిండితో చేసిన

నాగప్రతిమను బ్రాహ్మణునికి, లేదా దేవాలయంలో సూర్యబింబంతో (రాగి, వెండి, బంగారం, స్ఫటికం) సహా దానం చేయడం మంచిది. ఎవరి జన్మ రాశి, జన్మ నక్షత్రంలో గ్రహణం సంభవిస్తుందో వారు ఔషదాలతో కూడిన స్నానం చేస్తే గ్రహణ దోషం తొలగిపోతుంది. మణిశిల, యాలకులు, దేవదారు, కుంకుమపువ్వు, వట్టివేళ్లు, గోరోచనం, కస్తూరి, కుంకుమ, ఎర్ర పుష్పాలు, ఎర్రగన్నేరు, రక్త చందనం, చెరువు లేదా, పుట్ట మన్ను, గోశాల మట్టి తెప్పించుకుని గ్రహణానికి ముందే కలశంలో ఉంచి దేవతలను ఆవాహనం చేసి ఓం సూర్యాయనమః మంత్రం జపిస్తూ స్నానమాచరించాలి.

సూర్యగ్రహణానికి ముందు 12 గంటలు వేదకాలం. ఈ వేదకాలంలో ఆహారం తీసుకోరాదట. చిన్నపిల్లలు, వృద్ధులు కనీసం మూడు లేదా ఆరు ముహూర్త కాలాన్ని వేదకాలంగా పాటించి భోజనం చేయరాదు. అలా కాకుండా భోజనం చేసిన నరకం, నిద్రపోతే రోగం, మూత్రం పోసిన దారిద్ర్యం కలుగుతుందట. తైలాభ్యంగన స్నానం చేస్తే కుష్ఠు రోగం వస్తుందట.

★దానం చేయడం కుదరని సందర్భములో శాంతి స్నానమైనా చేయవలెను.

**---------సూర్యగ్రహణ శాంతి స్నానము-------**

**శ్లోకం|| తిలాంబుజోశీరకపూతికాష్టై:**
**ససర్షపక్షౌద్రశమీంద్రదూర్వై**
**సూర్యపరాగేవిషమేనరాణాం**
**భార్జ్యయుతైర్మజ్జనమిష్టదంస్యాత్!!జ్యోతిర్విదాభరణం**

**తాత్పర్యం:**–సూర్యగ్రహణమున అశుభస్థానమున కలిగినప్పుడు నువ్వులు పద్మములు వట్టివ్రేళ్ళు దేవదారు ఋషభ అను ఓషధి తేనే జమ్మి ఇంద్ర యవలు గరిక గంటు భారంగి, కలిపి స్నానము చేసిన ఆ దోషం తొలిగి శుభము ఇచ్చును.

---

**సర్వే జనా:సుఖినో భవంతు.**

**“దైవజ్ఞరత్న”,”జ్యోతిర్వాస్తురత్న”శ్రీమాన్ గొడవర్తి సంపత్కుమార్ అప్పలాచార్యులు.**
**M.Tech (CSE), M.A. (జ్యోతిషం).**
**శ్రీ లక్ష్మీ హయగ్రీవ జ్యోతిషాలయం.న్యూపాల్వంచ.భద్రాద్రి కొత్తగూడెం జిల్లా.**
**తెలంగాణా రాష్ట్రం.9393569333.sampathkumarastro@gmail.com**

---